# అథ ద్విచత్వారింశో%ధ్యాయః

## అంధకాసురుడు

నారద ఉవాచ |

శంఖచూడవధం శ్రుత్వా చరితం శశిమౌలినః | అయం తృప్తో%స్మి
నో త్వత్తోమృతం పీత్వా యథా జనః || 1

బ్రహ్మన్ యచ్చరితం తస్య మహేశస్య మహాత్మనః |
మాయామాశ్రిత్య సల్లీలాం కుర్వతో భక్తమోదదామ్ || 2

నారదుడిట్లు పలికెను -

శంఖచూడుని వధను, చంద్రశేఖరుని గాథను నీ నుండి విని ఈ నేను అమృతమును త్రాగిన జనుని వలె తృప్తిని పొందలేకున్నాను (1). ఓ బ్రహ్మా! మహాత్ముడు, మాయను ఆశ్రయించి చక్కటి లీలను చేయువాడు అగు ఆ మహేశ్వరుని చరితమును మరియొక దానిని చెప్పుము. ఆయన గాథ భక్తులకు ఆనందమును కలిగించును (2).

బ్రహ్మోవాచ |

జలంధరవధం శ్రుత్వా వ్యాసస్సత్య వతీ సుతః | అప్రాక్షీ
దిమమేవార్థం బ్రహ్మపుత్రం మునీశ్వరమ్ || 3

సనత్కుమారః పరోవాచ వ్యాసం సత్యవతీ సుతమ్ | సుప్రశంస్య
మహేశస్య చరితం మంగళాయనమ్ || 4

బ్రహ్మ ఇట్లు పలికెను -

సత్యవతీ పుత్రుడగు వ్యాసుడు జలంధరవధను విని బ్రమ్మపుత్రుడగు సనత్కుమార మహర్షిని ఇదే విధముగా ప్రశ్నించెను (3). అపుడు సనత్కుమారుడు సత్యవతీ పుత్రుడగు వ్యాసుని మిక్కిలి ప్రశంసించి, మంగళములకు నిదానమగు మహేశుని చరితమును చెప్పెను (4).

సనత్కుమార ఉవాచ |

శృణు వ్యాస మహేశస్య చరితం మంగళాయనమ్ | యథాంధకో గాణపత్యం ప్రాప శంభోః పరాత్మనః || 5

కృత్వా పరమ సంగ్రామం తేన పూర్వం మునీశ్వర | ప్రసాద్య తం మహేశానం సత్త్వ భావాత్పునః పునః || 6

మాహాత్మ్య మద్భుతం శంభో శ్శరణాగత రక్షిణః | సుభక్త వత్సల సై#్యవ నానాలీలా విహారిణః || 7

మాహాత్మ్య మేతద్వృషభధ్వజస్య శ్రుత్వా మునిర్గంధవతీసుతో హి |

వచో మహార్థం ప్రణిపత్య భక్త్యా హ్యువాచ తం బ్రహ్మసుతం మునీంద్రమ్ || 8

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ వ్యాసా! మంగళ నిధానమగు మహేశుని చరితమును, అంధకుడు శంభు పరమాత్మ యొక్క గణాధ్యక్ష స్థానమును పొందిన వృత్తాంతమును వినుము (5). ఓ మహర్షీ! ఆతడు మహేశ్వరునితో గొప్ప యుద్ధమును చేసి తన సాత్త్వీక భావములను పలుమార్లు ప్రదర్శించి తద్ద్వారా ఆతడు మహేశ్వరుని ప్రసన్నుని చేసుకొనెను (6). శరణు జొచ్చిన వారిన రక్షించువాడు, బక్తులయందు గొప్ప ప్రేమ గలవాడు, అనేక లీలలతో విహరించువాడు నగు శంభుని మాహాత్మ్యము అద్భుతమైనది (7). సత్యవతీపుత్రుడగు వ్యాస మహర్షి వృషభధ్వజుని ఈ మాహాత్మ్యమును విని నమస్కరించి భక్తితో బ్రహ్మపుత్రుడగు ఆ సనత్కుమార మహర్షితో గొప్ప అర్థము గల వచనము నిట్లు పలికెను (8).

వ్యాస ఉవాచ |

కో హ్యంధకో వై భగవన్మునీశ కస్యాన్వయే వీర్యవతః పృథివ్యామ్ |

జాతో మహాత్మా బలవాన్ ప్రధానః కిమాత్మకః కస్య సుతో%ంధకశ్చ || 9

ఏతత్సమస్తం సరహస్యమద్య బ్రవీహి మే బ్రహ్మసుత ప్రసాదాత్ |

స్కందాత్త్వయా వై విదితం హి సమ్యక్ మహేశ
పుత్రాదమితావబోధాత్ || 10

గాణపత్యం కథం ప్రాప శంభోః పరమతేజనః | సో%ంధకో ధన్య
ఏవాతి యో బభూవ గణ   శ్వరః || 11

వ్యాసుడిట్లు పలికెను -

ఓ భగవన్! మహర్షీ! అంధకుడెవ్వరు? మహాత్ముడు, బలవంతుడు, ప్రముఖుడు అగు ఈ అంధకుడు భూమియందు ఏ పరాక్రమవంతుని వంశములో జన్మించినాడు? ఆతని స్వరూపమేమి? అంధకుడు ఎవని పుత్రుడు? (9) ఓ బ్రహ్మపుత్రా! నీవు అనుగ్రహించి ఇపుడు ఈ రహస్యములతో గూడిన వృత్తాంతమునంతనూ నాకు చెప్పుము. మహేశ్వరుని కుమారుడు, గొప్ప జ్ఞానియగు కుమారస్వామినుండి నీవు ఈ వృత్తాంతమును చక్కగా తెలసుకొని యుంటివి (10). ఆ అంధకుడు గణాధ్యక్షుడై అతి ధన్యుడైనాడు. ఆతడు మహాతేజస్వియగు శంభుని వద్ద గణాధ్యక్ష పదవిని ఎట్లు పొందినాడు? (11)

బ్రహ్మోవాచ |

వ్యాసస్య చైతద్వచనం నిశమ్య ప్రోవాచ స బ్రహ్మ సుతస్తదానీమ్ |

మహేశ్వరోతీః పరమాప్త లక్ష్మీస్సంశ్రోతుకామం జనకం శుకస్య ||12

బ్రహ్మ ఇట్లు పలికెను -

బ్రహ్మపుత్రుడగు ఆ సనత్కుమారుడు శుకుని తండ్రియగు వ్యాసుని ఆ మాటలను విని, పరమభక్తులకు సంపదలనొసంగు మహేశ్వరుని లీలలను వినగోరుచున్న ఆ మహర్షితో నిట్లనెను (12).

సనత్కుమార ఉవాచ.

పురా%%గతో భక్తకృపాకరో%సౌ కైలాసతశ్శైలసుతా గణాఢ్యః |

విహర్తుకామః కిల కాశికాం వై స్వశైలతో నిర్జరచక్రవర్తీ || 13

స రాజధానీం చ విధాయ తస్యాం చక్కే పరోతీ స్సుఖదా జనానామ్ |

తత్రద్రక్షకం భైరవనామ వీరం కృత్వా సమం శైలజయా హి బహ్వీః || 14

స ఏకదా మందరనాధేయం గతో నగే తద్వర సుప్రభావాత్ |

తత్రాపి నాఆనగణవీరమఖ్యై శ్శివాసమేతో విజహార భూరి || 15

పూర్వే దిశో మందర శైలసంస్థా కపర్దినశ్చండ పరాక్రమస్య |

చక్రే తతో నేత్ర నిమీలనం తు సా పార్వతీ నర్మయుతం సలీలమ్ || 16

ప్రవాలహేమాబ్జ ధృతప్రబాభ్యాం కరాంబుజాభ్యాం నిమిమీల నేత్రే |

హరస్య నేత్రేషు నిమీలితేషు క్షణ న జాతస్సుమహాందకారః || 17

తతస్స్వర్శయోగాచ్చ మహేశ్వరస్య కరౌ చ తస్యాస్ష్స లితం మదాంభః |

శంభోర్లలాటే క్షణ వహ్నితప్తో వినిర్గతో భూరిజలస్య బిందుః || 18

గర్భో బభూవాథ కరాలవక్త్రో భయంకరః క్రోధపరః కృతఘ్నః |

అంధో విరూపీ జటిలశ్చ కృష్ణో నరేతరో వైకృతికస్సురోమా || 19

గాయన్ హసన్ ప్రరుదన్నృత్యమానో విలేలిహానో ఘురఘోరఘోషః |

జాతేన తేనాద్భుతదర్శనేన గౌరీం భవో%సౌ స్మితపూర్వమాహ || 20

సనత్కుమారుడిట్లు పలికెను -

భక్తులయందు దయను వర్షించువాడు, దేవతలకు చక్రవర్తి అగు శివుడు పూర్వము పార్వతితో మరియు గణములతో ప్రకాశిస్తూ, విహరింపగోరి తన కైలాస పర్వతము నుండి కాశీ నగరమునకు విచ్చేసెను (13). ఆయన కాశీని రాజధానిగా చేసి, భైరవుడను వీరుని దానికి రక్షకునిగానియమించి, పార్వతితో గూడి, జనులకు సుఖమును కలిగించే అనేకములగు గొప్ప లీలలను చేసెను (14). ఒకనాడాయన మందర పర్వతమునందలి శ్రేష్ఠమగు మాహాత్మ్యమును చూడగోరి అచటకు వెళ్లెను. ఆయన అచట కూడా ముఖ్యులగు అనేక గణాధ్యక్షులతో మరియు పార్వతీదేవితో గూడి అధికముగా విహరించెను (15). మందర పర్వతము యొక్క పూర్వ భాగమునందున్న ఆ పార్వతి భయంకర పరాక్రమము గలవాడు, జటాధారియగు శివుని కన్నులను అపుడు పరిహాసము కొరకై విలాసయుతముగా మూసెను (16). పగడములను, బంగారమును, పద్మమును పోలిన కాంతులు గల, పద్మమువంటి రెండు చేతులతో ఆమె కన్నులను మూసెను. శివుని మూడు కన్నములు మూయబడగానే క్షణకాలములో దట్టమగు చీకటి అలముకొనెను (17). అమె మహేశ్వరుని స్పృశించిన కారణముచే ఆమె చేతియందు ఉదయించిన మదజలము శంభుని మూడవకంటి యొక్క అగ్నిచే క్షణకాలము తపింపచేయబడి పెద్ధ జలబిందువు రూపములో నిర్గమించెను (18). అపుడు గర్భము ఏర్పడి వికృతమగు ముఖముతో బయమును గొల్పువాడు, క్రోధమే ప్రధానలక్ష్యముగా గలవాడు, కృతఘ్నుడు, గ్రుడ్డివాడు, విరూపి, జటలు గలవాడు, నల్లనివాడు, వికృతరూపము గలవాడు, అధికమగు రోమములు గలవాడు అగు అమానవుడు జన్మించెను (19). ఆతడు పాడుతూ, నవ్వుతూ, గట్టిగా ఏడ్చుచూ, నాట్యమును చేయుచూ, నాలకును బయటపెట్టి భయంకరమగు శబ్దమును చేసెను. ఆ అద్భుతాకారుడు జన్మించగానే, శివుడు చిరనవ్వుతో పార్వతిని ఉద్దేశించి ఇట్లు పలెను (20).

శ్రీ మహేశ ఉవాచ|

నిమీల్య నేత్రాణి కృతం చ కర్మ బిభేషి సోఽస్మాద్ధయితే కథం త్వమ్ |

గౌరీ హరాత్త ద్వచనం నిశమ్య విహస్యమానా ప్రముమోచ నేత్రే ||
21

జాతే ప్రకాశే సతి ఘోరరూపో జాతోం%ధకారాదపి నేత్రహీనః |

తాదృగ్విధం తం చ నిరీక్ష్య భూతం పప్రచ్ఛ గౌరీ పురుషం
మహేశమ్ || 22

శ్రీ మహేశ్వరుడిట్లు పలికెను -

ఓ ప్రియురాలా! నీవు కన్నులను మూయుట అను పనిని చేసి ఇపుడు దీనికి భయపడుచుంటివేల? శివుని ఈ మాటను విని పార్వతి నవ్వుతూ కన్నులపై నుండి చేతులను తీసివేసెను (21). వెలుతురు రాగానే పార్వతి, అంధకారమునుండి పుట్టుటచే కన్నులు లేనివాడు, భయంకరాకారుడుఅగు ఆ విదమైన పురుషాకార ప్రాణిని గాంచి, మహేశ్వరుని ఇట్లు ప్రశ్నించెను (22).

గౌర్యువాచ |

కో%యం విరూపో భగవన్ హి జాతో నావగ్రతో ఘోర భయంకరశ్చ |

వదస్వ సత్యం మమ కిం నిమిత్తం సృష్టో%థ వా కేన చ కస్య పుత్రః
|| 23

గౌరి ఇట్లు పలికెను -

హే భగవాన్! మన ఇద్దిరి కళ్ల యెదుట జన్మించినవాడు, ఘోర భయంకరాకారుడు, వికృత రూపము గలవాడు అగు ఈతడు ఎవడు? నాకు సత్యమును చెప్పుడు. వీనిని ఎవరు ఎందులకు సృష్టించినారు? వీడు ఎవరి పుత్రుడు? (23)

సనత్కుమార ఉవాచ |

శ్రుత్వా హరస్తద్వచనం ప్రియాయా లీలాకర స్సృష్టి కృతోం%ధ
రూపామ్ |

లీలా కరాయాస్త్రి జగజ్జనన్యా విహస్య కించిద్భగవానువాచ || 24

సనత్కుమారుడిట్లు పలికెను -

లీలలను ప్రకటించునది, ముల్లోకములకు తల్లి, తనకు ప్రియురాలు అగు పార్వతియొక్క ఆ మాటలను విని లీలలను చేయు హర భగవానుడు కొద్దిగా నవ్వెను. ఆ గ్రుడ్డివానిని సృష్టించినది ఆమెయే. ఆయన ఇట్లనెను (24).

మహేశ ఉవాచ |

శృణ్వంబికే హ్యద్భుత వృత్తకారే ఉత్పన్న ఏషో%ద్భుత చండవీర్యః |

నిమీలితే చక్షుషి మే భవత్యా స స్వేదజో మే%ంధకనామధేయః || 25

త్వం చాస్య కర్త్రాస్య యతానురూపం త్వయా ససఖ్యా దయయా గణ భ్యః |

స రక్షితవ్యస్త్వయి తం హి వైకం విచార్య బుద్ధ్యా కరణీయ మార్యే || 26

మహేశ్వరుడిట్టు పలికెను -

ఓ అంబికా! వినుము. నీవు అద్భుతమగు చర్యలను చేయుచుందువు. నీవు నా కన్నులను మూసినపుడు స్వేదము నుండి ఈ అద్భుత బయంకర పరాక్రమము గల బాలుడు పుట్టినాడు. వీని పేరు అంధకుడు (25). ఓ పూజ్యురాలా! వీనిని సృష్టించినది నీవే. నీవు, నీ చెలికత్తెలు వీనిని యథా యోగ్యముగా పాలించుడు. వీనిని గణముల బారినుండి రక్షించుచుండుడు. వీడు నీపై ఆధారపడియున్నాడు. నీవు నీ బుద్ధితో ఆలోచించి తగిన విధముగా చేయవలసినది (26).

సనత్కుమార ఉవాచ |

గౌరీ తతో భర్తృవచో నిశమ్య కారుణ్య భావాత్సహితా సఖీబిః |

నానా ప్రకారైర్బహుభిర్వ్యుపాయైశ్చకార రక్షాం స్వసుతస్య యద్వత్
|| 27

కాలే%థ తస్మిన్ శిశిరే ప్రయాతో హిరణ్య నేత్ర స్త్వథ పుత్రకామః ||

స్వజ్యేష్ఠ బంధోస్తనయప్రతానం సంవీక్ష్య చాసీత్ర్పియయా నియుక్తః
|| 28

అరణ్య మాశ్రిత్య తపశ్చకారాసురస్తదా కశ్యపజస్సుతార్థమ్ |

కాష్ఠోపమో%సౌ జితరోషదోషస్సం దర్శనార్థం తు మహేశ్వరస్య ||
29

తుష్టః పినాకీ తపసాస్య సమ్యగ్వర ప్రదానాయ య¸° ద్విజేంద్ర |

తత్స్థానమాసాద్య వృషధ్వజో%సౌ జగాద దైత్యప్రవరం మహేశః ||
30

సనత్కుమారుడిట్లు పలికెను -

అపుడు పార్వతి భర్తయొక్క పలుకులను విని దయతో నిండిన హృదయము గలదై తన సఖురాంద్రతో గూడి అంధకుని తన పుత్రుని వలె అనేకములగు ఉపాయములచే రక్షించెను (27). ఆ కాలములో హిరణ్యాక్షుని ప్రియురాలు ఆతని అన్నగారికి బహుపుత్రులుండుటను గాంచి హిరణ్యాక్షుని తపస్సును చేయుమని నియోగించగా, ఆతడు పుత్రార్థియై తపస్సు కొరకు శిశిర ఋతువులో బయలుదేరెను (28). అపుడు కశ్యపుని కుమారుడగు ఆ హిరణ్యాక్షుడు అడవిలో నుండి పుత్రార్థియై క్రోధాది దోషములను జయించి మహేశ్వరుని దర్శనము కొరకై స్తంబము వలె కదలిక లేకుండగా తపస్సును చేసెను (29). ఓ బ్రహ్మణ శ్రేష్ఠా ! పినాకధారి, వృషభధ్వజుడు అగు మహేశ్వరుడు ఆతని తపస్సునకు ప్రసన్నుడై చకని వరమునీయగోరి ఆ స్థానమునకు వెళ్లి ఆ రాక్షస వీరునితో నిట్లనెను (30).

మహేశ ఉవాచ |

హే దైత్యనాథ కురునేంద్రియ సంఘపాతం
కిమర్థమేతద్ర్వతమాశ్రితం తే |

ప్రబ్రూహి కామం వరదో భవో%హం యదిచ్ఛసి త్వం సకలం
దదామి || 31

మహేశ్వరుడిట్లు పలికెను -

ఓ దానవవీరా! ఈ దేహేంద్రియ సంఘాతము కుప్పకూలునంతటి తపస్సును చేయకుము. నీవు ఈ దీక్షను స్వీకరించుటకు కారణమేమి? నీ కోర్కెను వెల్లడించుము. నేను వరములనిచ్చు శివుడను. నీవు కోరిన వరములనన్నిటినీ ఇచ్చెదను (31).

సనత్కుమార ఉవాచ |

సరస్యమాకర్ణ్య మహేశవాక్యం హ్యతిప్రసన్నః కనకాక్షదైత్యః |

కృతాంజలిర్నమ్రశిరా ఉవాచ స్తుత్వా చ నత్వా వివిధం గిరీశమ్ ||
32

సనత్కుమారుడిట్లు పలికెను -

మహేశ్వరుని ప్రీతి పూర్వకమగు ఈ పలుకులను విని హిరణ్యాక్షుసురుడు మిక్కిలి ప్రసన్నుడై చేతులు జోడించి శిరసు వంచి కైలాసవాసుని పరిపరి విధముల స్తుతించి ప్రణమిల్లి ఇట్లు పలికెను (32).

హిరణ్యాక్ష ఉవాచ |

పుత్రస్తు మే చంద్రలలాట నాస్తి సువీర్యవాన్ దైత్యకులానురూపీ |

తదర్థమేతద్ర్వతమాస్థితో%హం తం దేహి దేవేశ సువీర్యవంతమ్ ||
33

యస్మాచ్చ మద్భ్రాతు రనంత వీర్యాః ప్రహ్లాదపూర్వా అపి పంచ
పుత్రాః |

మమేహ నాస్తీతి గతాన్వయో%హం కో మామకం రాజ్యమిదం బుభూషేత్ || 34

రాజ్యం పరస్య స్వబలేన హృత్వా భుంక్తే%థవా స్వం పితురేవ దృష్టమ్ |

చ ప్రోచ్యతే పుత్ర ఇహత్వముత్ర పుత్రీ స తేనాపి బవేత్పితాసౌ || 35

ఊర్ధ్వం గతిః పుత్రవతాం నిరుక్తా మనీషిభిర్ధర్మభృతాం వరిష్ఠైః |

సర్వాణి భూతాని తదర్థమేవమతః ప్రవర్తేత పశూన్ స్వతేజసః || 36

నిరన్వయస్యాథ న సంతి లోకాస్తదర్థమిచ్ఛంతి జనాస్సురేభ్యః |

సదా సమారాధ్య సురాత్రి పంకజం యాచంత ఇత్థం సుతమేకమేవ || 37

హిరాణ్యక్షుడిట్లు పలికెను-

ఓ చంద్రశేఖరా! నాకు గొప్ప పరాక్రమశాలి, రాక్షస వంశమునకు తగినవాడు అగు కొడుకు లేడు. ఓ దేవదేవా! నేను పుత్రుని గోరి ఈ వ్రతమును చేబట్టితిని. గొప్ప పరాక్రమశాలియగు పుత్రుని ఇమ్ము (33). నా సోదరునకు గొప్ప పరాక్రమము గల అయిదుగురు కొడుకులు గలరు. వారిలో ప్రహ్లాదుడు పెద్దవాడు. నాకు పుత్రులు లేరు. ఈ లోకములో నా వంశము లేకుండా పోవును. నా ఈ రాజ్యమునకు వారసులెవరు గలరు? (34) తన పరాక్రమముచే శత్రురాజ్యమును ఆక్రమించి అనుబవించినవాడు, లేదా తండ్రి నుండి లభించిన స్వీయ రాజ్యము ననుభవించువాడు పుత్రుడనబడును. అట్టి పుత్రుని వలన మాత్రమే వ్యక్తి తండ్రియనుపదమునకు అనర్హుడగును. అట్టి తండ్రి ఇహపరములలో సుఖించును (35). పుత్రుడు గలవాడు ఊర్ధ్వలోకములను పొందెదరని ధర్మవేత్తలలో శ్రేష్ఠులగు మహర్షులు చెప్పుచున్నారు. సర్వప్రాణులు సంతానము కొరకు ప్రవర్తిల్లు చున్నవి. కావున వ్యక్తి తన తేజస్సును సంతానము రూపములో

గాంచవలెను (36). వంశాంకురము లేని వానికి పుణ్యలోకములు లేవు. కావుననే జనులు సర్వదా దేవతల నారాధించి వారినుండు ఒక పుత్రుని కోరుచున్నారు (37).

సనత్కుమార ఉవాచ |

ఏతద్భవస్తద్వచనం నిశమ్య కృపాకరో దైత్యనృప్య తుష్టః |

తమాహ దైత్యాతపనాస్తి పుత్రస్త్వ ద్వీర్యజః కింతు దదామి పుత్రమ్ || 38

మమాత్మజం త్వంధకనామదేయం త్వతుల్య వార్యం త్వపరాజితం చ |

వృణీష్వ పుత్రం సకలం విహాయ దుఃఖం ప్రతీచ్ఛస్వ సుతం త్వమేవ || 39

ఇత్యేవ ముక్త్వా ప్రదదౌ తస్మై#్మ హిరణ్య నేత్రాయ సుతం ప్రసన్నః |

హరస్తు గౌర్యా సహితో మహాత్మా భూతాధినాతస్త్రి పురారి రుగ్రః || 40

నతో హరాత్ర్పాప్య సుతం స దైత్యః ప్రదక్షిణీ కృత్య యతా క్రమేణ |

స్తోత్రైరనే కైరభిపూజ్య రుద్రం తుష్టస్స్వరాజ్యం గతవాన్మహాత్మా || 41

తతస్తు పుత్రం గిరిశాదవాప్య రసాతలం చండ పరాక్రమస్తు |

ఇమాం దరిత్రీ మనయత్స్వ దేశం దైత్యో విజిత్వా త్రిదవ్యానశేషాన్ || 42

తతస్తు దేవైర్మునిభిశ్చ సిద్ధై స్స రాత్మకం యజ్ఞమయం కరాలమ్ |

వారాహమాశ్రిత్య వపుః ప్రధానమారాధితో విష్ణురనంతవీర్యః || 43

ఘోణా ప్రహారైర్వివిధైర్ధరిత్రీం విదార్య పాతాలతలం ప్రవిశ్య |

తుండేన దైత్యాన్ శతశో విచూర్ణ్య దంష్ట్రాభిరగ్ర్యాభిరఖండితాభిః ||
44

సనత్కుమారుడిట్లు పలికెను -

దయానిధియగు శివుడు రాక్షస చక్రవర్తి యొక్క ఆ మాటను విని సంతసించి ఆతనితో నిట్లనెను. ఓ రాక్షస రాజా! నీ వీర్యము వలన పుత్రుడు జన్మించు అవకాశము లేదు. కాని నీకు పుత్రుని ఇచ్చెదను (38). అంధకుడను పేరు గల నా పుత్రుడు నీతో సమమగు పరాక్రమము గలవాడు, పరాజయము నెరుంగని వాడు దుఃఖము నంతనూ వీడి నీవు వానిని పుత్రునిగా ఎన్నుకొని స్వీకరించుము (39). గౌరీ సమేతుడు, మహాత్ముడు, పశుపతి, త్రిపురాంతకుడు, ఉగ్రుడు. పాపహారి అగు శివుడు ప్రసన్నుడై ఇట్లు పలికి ఆ హిరణ్యాక్షునకు పుత్రుని ఇచ్చెను (40). మహాత్ముడగు ఆ రాక్షసుడు శివుని నుండి పుత్రుని పొంది వరుసగా పార్వతీపరమేశ్వరులకు ప్రదక్షిణము చేసి, ఆ రుద్రుని అనేక స్తోత్రములతో చక్కగా పూజించి ఆనందముతో తన రాజ్యమునకు వెళ్లెను (41). భయంకరమగు పరాక్రమము గల ఆ రాక్షసుడు శివుని నుండి పుత్రుని పొంది, తరువాత దేవతలనందరినీ జయించి ఈ భూమిని తన రసాతల దేశమునకు గొనిపోయెను (42). అపుడు దేవతలు, మును, సిద్ధులు ఆరాధించగా అనంత శక్తిమంతుడగు విష్ణువు సర్వయాజ్ఞాత్మకము, భయంకరము, శ్రేష్ఠము అగు వరాహ దేహమును దాల్చి (43). తన ముఖముతో భూమిని అనేక పర్యాయములు కొట్టి చీల్చి పాతాళ లోకములో ప్రవేశించి, న ముఖముతో మరియు భయంకరములగు పదునైన కోరలతో చాలమంది దైత్యులను సంహరించెను (44).

పాద ప్రహారైరశని ప్రకాశైరున్మథ్య సైన్యాని నిశాచరాణామ్ |

మార్తండకోటి ప్రతిమేన పశ్చాత్సు దర్శనేనాద్భుతతుండ తేజాః ||
45

హిరణ్య నేత్రస్య శిరో జ్వలంతం చిచ్ఛేద దైత్యాంశ్చ దదాహ దుష్టాన్ |

తతః ప్రహృష్టో దితిజేంద్రరాజం స్వమంధకం తత్ర స చాభ్యషించత్ || 46

స్వస్థాన మాగత్య తతో దరిత్రీం దంష్ట్రాంకురేణోద్ధరతః ప్రహృష్టః |

భూమిం చ పాతాల తలాన్మహాత్మా పుపోష భాగం త్వథ పూర్వకం తు || 47

దేవైస్సమస్తై#ర్మునిభిః ప్రహృష్టైరభిష్టుతః పద్మభువా చ తేన|

య¸° స్వలోకం హరిరుగ్రకాయో వరాహరూపస్తు సుకార్యకర్తా || 48

హిరణ్యనేత్రే %థ హతే%సురేశే వారాహరూపేణ సురేణ దేవాః |

దేవాస్సమస్తా మునయశ్చ సర్వే పరే చ జీవాస్సుఖినో బభూవుః || 49

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే హిరణ్యాక్ష వధో నా ద్విచత్వారింశో%ధ్యాయః (42).

అద్భుతమగు తుండముయొక్క ప్రకాశము గల ఆ వరాహమూర్తి పిడుగుల వంటి పాదముల దెబ్బలతో రాక్షస సైన్యములను నశింపజేసి, తరువాత కోటి సూర్యుల కాంతి కలిగి సుదర్శన చక్రముతో (45). హిరణ్యాక్షుని ప్రకాశించే తలను నరికి దుష్టులగు రాక్షసులను సంహరించెను. అపుడాయన సంతసించి వాని పుత్రుడగు అంధకుని పాతాళ రాజ్యమునందు రాక్షస చక్రవర్తినిగా అభిషేకించెను (46). ఆయన భూమిని పాతాళము నుండి తన దంష్ట్రల అగ్రభాగములతో పైకి లేవనెత్తను. ఆ మహాత్ముడు భూమిని పూర్వస్థానములో ప్రతిష్ఠించి ఆనందముతో స్వస్థానమును చేరుకొనెను (47). విష్ణువు వరాహముయొక్క భయంకరమగు దేహమును దాల్చి గొప్ప కార్యమును పూర్తిచేసెను. సర్వదేవతలు, మునులు ఆనందముతో ఆయనను స్తుతించిరి. బ్రహ్మకూడ స్తుతించుచుండగా ఆయన తన లోకమునకు వెళ్లెను (48). విష్ణువు

వరాహరూపముతో రాక్షసేశ్వరుడగు హిరణ్యాక్షుని వధించగా, సర్వదేవతలు, మునులు, ఇతర సకల ప్రాణులు సుఖమును పొందిరి (49).

శ్రీ శివ మహా పురాణములోని రుద్ర సంహితయందు యుద్ధఖండలో హిరణ్యాక్షవధ యను నలుబది

రెండవ ఆధ్యాయము ముగిసినది (42).

## అథ త్రిచత్వారింశోధ్యాయః

## హిరణ్య కశిపుని నృసింహుడు వధించుట

వ్యాస ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ హతే తస్మిన్ సురద్రహి | కిమకార్షీత్తతస్తస్య జ్యేష్ఠ భ్రాతా మహాసురః || 1

కుతూహలమితి శ్రోతుం మమా %తీహ మునీశ్వర | తచ్ఛ్రావయ కృపాం కృత్వా బ్రహ్మపుత్ర నమో %స్తుతే || 2

వ్యాసుడిట్లు పలికెను -

ఓ సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. సురద్రోహియగు ఆ హిరణ్యాక్షుడు సంహరింపబడిన తరువాత వాని పెద్ద సోదరుడగు మహా రాక్షసుడు ఏమి చేసెను? (1) ఓ మహర్షీ! ఈ విషయమును వినవలెనని నాకు ఇప్పుడు చాల కుతూహలము గలదు. కావున దయచేసి వినిపించుము. ఓ బ్రహ్మపుత్రా! నీకు నమస్కారమగు గాక! (2).

బ్రహ్మోవాచ|

ఇత్యాకర్ణ్య వచస్తస్య వ్యాసస్య స మునీశ్వరః | సనత్కుమారః ప్రోవాచ స్మృత్వా శివపదాంబుజమ్ || 3

బ్రహ్మ ఇట్లు పలికెను -

ఆ వ్యాసుని ఈ మాటలను విని ఆ సనత్కుమార మహర్షి శివుని పాద పద్మములను స్మరించి ఇట్లు పలికెను (3).

సనత్కుమార ఉవాచ |

భ్రాతర్యేవం వినిహతే హరిణా క్రోడమూర్తినా | హిరణ్యకశిపుర్వ్యాస పర్యతప్యద్రుషా శుచా || 4

తతః ప్రజానాం కదనం విధాతుం కదన ప్రియాన్ | నిర్దిదేశాసురాన్ వీరాన్ హరివైర ప్రియో హి సః || 5

అథ తే భర్తృ సందేశమాదాయ శిరసా%సురాః | దేవప్రజానాం కదనం విదధుః కదనప్రియాః || 6

తతో విప్రకృతే లోకే%సురైసై#ర్దుష్టమానసైః దివం దేవాః పరిత్యజ్య భువి చేరురలక్షితాః || 7

హిరణ్యకశిపుర్భ్రాతు స్సంపరేతస్య దుఃఖితః | కృత్వా కరోదకాదీని తత్కలత్రాద్యసాంత్వయత్ || 8

తతస్స దైత్యరాజేంద్రో హ్యజేయమజరామరమ్ | ఆత్మానమప్రతి ద్వంద్వ మేకరాజ్యం వ్యధిత్సత || 9

సనత్కుమారు డిట్లు పలికెను -

ఓ వ్యాసా! వరాహమూర్తిని దాల్చి విష్ణువు తన సోదరుని ఈ తీరున సంహరించగా, హిరణ్యకశిపుడు కోపముతో దుఃఖముతో పరితపించెను (4) : విష్ణువుతో వైరమునందు మక్కువగల ఆతడు అపుడు యుద్ధప్రియులు వీరులు అగు అసురులను ప్రజలలో కలహలములను సృష్టించమని ఆదేశించెను (5). అపుడు కలహప్రియులగు ఆ రాక్షసులు తమ రాజుయొక్క ఆజ్ఞను శిరసా వహించి దేవతలకు, ప్రజలకు కలహములను సృష్టించిరి (6). దుష్ట బుద్ధులగు ఆ రాక్షసులచే లోకము కల్లోలితము చేయబడగా దేవతలు స్వర్గమును వీడి అదృశ్య రూపముతో భూమిపై తిరుగాడిరి (7). హిరణ్యకశిపుడు సోదరుని మరణమునకు దుఃఖించి వాని భార్యను ఇతరులను ఓదార్చి తర్పణాదులను చేసెను (8). అపుడా

రాక్షస చక్రవర్తి తనను జరామరణములు లేని వానినిగను, పరాజయములేని వానినిగను, తన ఏకచ్ఛత్రాధిపత్యమును నిష్కంటకముగను చేసుకొనెను (9).

సతేపే మందరద్రోణ్యా తపః పరమదారుణమ్ | ఊర్ధ్వ బాహుర్నభోదృష్టిః పాదాంగుష్ఠా శ్రితావనిః || 10

తస్మింస్తపస్తప్యమానే దేవాస్సర్వే బలాన్వితాః | దైత్యాన్ సర్వాన్ వినిర్జిత్య స్వాని స్థానాని భేజిరే || 11

తస్య మూర్ధ్న స్సముద్భూత స్సధూమో %గ్ని స్తపోమయః | తిర్యగూర్ధ్వమధోలోకానతపద్విష్వ గీరితః || 12

తేన తప్తా దివం త్యక్త్వా బ్రహ్మలోకం యయుస్సురాః | ధాత్రే విజ్ఞాపయామాసుస్తత్తపో వికృతాననాః || 13

అథ విజ్ఞాపితో దేవైర్వ్యాస తైరాత్మ భూర్విధిః | పరీతో భృగు దక్షాద్యైర్య¸° దైత్యేశ్వరాశ్రమమ్ || 14

ప్రతాప్య లోకానశిలాంస్తతో%సౌ సమాగతం పద్మభువం దదర్శ |

వరం హి దాతుం తమువాచ ధాతా వరం వృణీష్వేతి పితామహో%పి |

నిశమ్య వాచం మధురాం విధాతుర్వచో% బ్రవీదేవమమూఢ బుద్ధిః || 15

ఆతడు మందర పర్వతము నందలి కందరములో నేలపై కాలి బొటన వ్రేలిపై నిలబడి ఆకాశము వైపునకు చూస్తూ చేతులను పైకెత్తి మిక్కిలి ఉగ్రమగు తపస్సును చేసెను (10). ఆతడు తపస్సును చేయుచుండగా బలవంతులైన దేవతలందరు రాక్షసులు నందరినీ2 జయించి తమ తమ స్థానములను కైవసము చేసుకొనిరి (11) వాని శిరస్సునుండి బయలుదేరిన, తపోరూపమైన, పొగతో గూడిన అగ్ని భూతలమునకు సమాంతరముగా క్రిందికి పైకి సర్వత్రా వ్యాపించి ప్రాణులను తపింపజేసెను (12). దానిచే తాపమును పొంది, ఆ తపస్సుయొక్క

ప్రభావముచే వికృతములైన ముఖములు గల దేవతలు స్వర్గమును విడిచి బ్రహ్మలోకమునకు వెళ్లి బ్రహ్మకు విన్నవించిరి (13). ఓ వ్యాసా! అపుడు దేవతల విన్నపమును మన్నించి స్వయంభువుడగు బ్రహ్మ భృగుదక్షాదులు వెంటరాగా ఆ రాక్షస రాజుయొక్క ఆశ్రమమునకు వెళ్లెను (14). ఆతడీ విధముగా ముల్లోకములను తపింపజేయుచూ, తనకు వరము నిచ్చుటకై విచ్చేసిన పద్మ సంభవుడగు బ్రహ్మను గాంచెను. పితామహుడగు బ్రహ్మ ఆతనితో 'వరమును కోరుకొనుము' అని పలుకగా, బ్రహ్మయొక్క ఆ మధురమగు వాక్యమును విని బుద్ధిమంతుడగు హిరణ్య కశిపుడు ఇట్లు పలికెను (15).

హిరణ్య కశిపురువాచ |

మృత్యోర్భయం మే భగవన్ ప్రజేశ పితామహాభూన్న కదాపి దేవ |

శస్త్రాస్త్ర పాశాశని శుష్కవృక్ష గిరీంద్రతోయాగ్ని రిపుప్రహారైః || 16

దేవైశ్చ దైత్యైర్మునిభిశ్చ సిద్ధై స్త్వత్సృష్టజీ వైర్బహు వాక్యతః కిమ్ |

స్వర్గే ధరణ్యా దివసే నిశాయాం నైవోర్ధ్వతో నాప్యధతః ప్రజేశ || 17

హిరణ్యకశిపుడిట్లు పలికెను -

హే భగవన్! ప్రజాపతీ! పితామహా: దేవా! నాకు శత్రువులచే ప్రయోగింపబడే శస్త్రములు, అస్త్రములు, వజ్రము, ఎండు చెట్లు, పర్వతరాజములు, నీరు, నిప్పు ఇత్యాదులచే మరణ భయము లేకుండుగాక! (16) ఇన్ని మాటలేల? ఓ ప్రజాపతీ! నాకు దేవతలు, దైత్యులు, మునులు, సిద్ధులు మరియు నీచే సృష్టింపబడిన జీవుల జేతిలో, స్వర్గమునందు గాని, భూమియందుగాని, పగలు గాని, రాత్రి గాని, పైన గాని, క్రింద గాని మృత్యువు లేకుండు గాక! (17)

సనత్కుమార ఉవాచ |

తస్మై#్యతదీదృగ్వచనం నిశమ్య దైత్యేంద్ర తుష్టో%స్మి లభస్వ సర్వమ్ |

ప్రణమ్య విష్ణుం మనసా తమాహ దయాన్వితోऽసావతి పద్మయోనిః || 18

అలం తపస్తే పరిపూర్ణ కామస్సమాస్సహస్రాణి చ షణ్ణవత్య |

ఉత్తిష్ఠ రాజ్యం కురు దానవానాం శ్రుత్వా గిరం తత్సుముఖో బభూవ || 19

రాజ్యాభిషిక్తః ప్రపితామహేన త్రైలోక్యనాశాయ మతిం చకార |

ఉత్పాద్య ధర్మాన్ సకలాన్ ప్రమత్తో జిత్వాऽऽహవే సోऽపి సురాన్ సమస్తాన్ || 20

తతో భయాదింద్రముఖాశ్చ దేవాః పితామహాజ్ఞాం సమవాప్య సర్వే |

ఉపద్రుతా దైత్యవరేణ జాతాః క్షీరోదధిం యత్ర హరిస్తు శేతే || 21

ఆరాధయా మాసురతీవ విష్ణుం స్తుత్వా వచోభిస్సుఖదం హి మత్వా |

నివేదయామాసురథో ప్రసన్నం దుఃఖం స్వకీయం సకలం హి తే తే || 2

శ్రుత్వా తదీయ సకలం హి దుఃఖం తుష్టో రమేశః ప్రదదౌ వరాంస్తు |

ఉత్థాయ తస్మాచ్ఛయనాదుపేంద్రో నిజానురూపైర్వివిధైర్వచోభిః || 23

ఆశ్వాస్య దేవానఖిలాన్ మునీన్ వా ఉవాచ వైశ్వానర తుల్య తేజాః |

దైత్యం హనిష్యే ప్రసభం సురేశాః ప్రయాత ధామాని నిజాని తుష్టాః || 24

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆతని ఈ మాటను విని పద్మ సంభవుడగు బ్రహ్మ దయ గలవాడై మనస్సులో విష్ణువునకు ప్రణమిల్లి 'ఓ రాక్షసవీరా! నేను ప్రసన్నుడనైతిని ; నీవు కోరిన సర్వమును పొందుము' అని పలికెను (18). 'నీవు తపస్సును చాలించుము. నీ కోరిక పరిపూర్తిని చెందినది. నీవు తొంబై ఆరువేల సంవత్సరములు తపస్సును చేసితివి. లెమ్ము. దానవ రాజ్యము నేలుము' అను మాటను విని ఆతడు తపస్సు విరమించుటకు సుముఖతను గనబరచెను (19). బ్రహ్మచే రాజ్యమునందు అభిషిక్తుడైన ఆతడు ముల్లోకములను నాశనము చేయ నిశ్చయించుకొని గర్వించిన వాడై, సమస్త ధరమముల నుల్లంఘించెను. ఆతడు సమస్త దేవతలను యుద్ధములో జయించెను (20). అపుడు ఆ రాక్షస వీరునిచే పీడింపబడిన ఇంద్రాది దేవతలందరు భయభీతులై ప్రజాపతియొక్క అనుమతిని పొంది విష్ణువు నిద్రిస్తున్న క్షీరసముద్ర ప్రాంతమునకు వెళ్లిరి (21). విష్ణువు తమకు సుఖమును ఈయగలడని భావించిన ఆ దేవతలు ఆయనను మిక్కుటముగా ఆరాధించి వచనములతో స్తుతించిరి. అపుడు ప్రసన్నుడైన విష్ణువునకు వారు తమ దుఃఖము నంతనూ వివరించిరి (22). వారి దుఃఖము నంతనూ విని ఇంద్రుని అనుజుడు, లక్ష్మీపతి యగు విష్ణువు సంతసించి ఆ తల్పముపై నుండి లేచి తన స్థాయికి తగిన వివిధ వచనములను పలికి వారికి వరముల నిచ్చెను (23). వైశ్వానరాగ్నితో సమానమగు తేజస్సు గల విష్ణువు సర్వదేవతలను, మునులను కూడ ఓదార్చి, 'ఓ దేవ వీరులారా! నేను బలమును ప్రయోగించి ఆ రాక్షసుని సంహరించెదను; మీరు సంతోషముతో మీ ధామమునకు వెళ్లుడు' అని పలికెను (24).

శ్రుత్వా రమేశస్య వచస్సురేశాశ్శక్రాదికాస్తే నిఖిలాస్సుతుష్టాః |

యయుస్స్వధామాని హిరణ్య నేత్రానుజం చ మత్వా నిహతం మునీశ || 25

ఆశ్రిత్య రూపం జటిలం కరాలం దంష్ట్రాయుధం తీక్ష్ణ నఖం సువానమ్ |

సైంహం చ నారం సువిదారితాస్య మార్తండకోటి ప్రతిమం సుఘోరమ్ || 26

యుగాంత కాలాగ్ని సమప్రభావం జగన్మయం కిం బహుభిర్వచోభిః |

అస్తం రవౌ సో%పి హి గచ్ఛతీశో గతో%సురాణాం నగరీం మహాత్మా || 27

కృత్వా చ యుద్ధం ప్రబలైస్స దైత్యైర్ధత్వాథ తాన్ దైత్య గణాన్ గృహీత్వా |

బభ్రామ తత్రాత్రాద్భుత విక్రమశ్చ బభంజ తాంస్తానసురాన్నృసింహః || 28

దృష్టస్స దైత్యైరతుల ప్రభావస్తే రేఖిరే తేహి తథైవ సర్వే |

సింహం చ తం సర్వమయం నిరీక్ష్య ప్రహ్లాదనామా దితిజేంద్రపుత్రః |

ఉవాచ రాజానమయం మృగేంద్రో జగన్మయః కిం సముపాగతశ్చ || 29

ఓ మహర్షీ! ఆ ఇంద్రాది దేవనాయకులందరు విష్ణువు యొక్క వచనములను విని, హిరణ్యాక్షుని సోదరుడు మరణించినట్లే యని భావించి, చాల సంతోషముతో తమ సెలవులకు వెళ్లిరి (25). జూలుతో ప్రకాశించునది, భయంకరమగు ఆకారము గలది, దంష్ట్రలే ఆయుధములుగా గలది, వాడి గోళ్లు గలది, సుందరమగు ముక్కు గలది, తెరచిన పెద్ద నోరు గలది, కోటి సూర్యుల కాంతి గలది, మిక్కిలి ఘోరమైనది, ప్రళయకాలాగ్నిని బోలిన ప్రభావము గలది, జగత్తును అధికముగా వ్యాపించిన రూపము గలది అగు నృసింహాకారమును విష్ణువు దాల్చెను. ఇన్నిమాటలేల? మహాత్ముడు, ఈశ్వరుడునగు ఆ విష్ణువు సూర్యాస్తమయకాలములో హిరణ్యకశిపుని నగరమునకు వెళ్లెను (26, 27). అద్భుతమగు పరాక్రమముగల ఆ నృసింహుడు బలశాలురగు రాక్షసులతో యుద్ధమును చేసి ఆ రాక్షస గణములను ఒడిసి పట్టి సర్వత్రా తిరుగుతూ, ఆ రాక్షసులను మట్టు పెట్టెను (28). సాటిలేని

ప్రభావము గల ఆ నృసింహుని రాక్షసులందరు చూచిరి.
సర్వమును ఆక్రమించియున్న ఆ సింహమును గాంచి
హిరణ్యకశిపుని పుత్రుడగు ప్రహ్లాదుడు రాజుతో నిట్లనెను :
జగత్స్వరూపుడగు పరమాత్మ నృసింహరూపములో ఇట్లు వచ్చుటకు
కారణమేమి? (29)

ప్రహ్లాద ఉవాచ |

ఏష ప్రవిష్టో భగవాననంతో నృసింహమాత్రో నగరం త్వదంతః |

నివృత్త యుద్ధాచ్చరణం ప్రయాహి పశ్యామి సింహస్య
కరాలమూర్తిమ్ || 30

యస్మాన యోద్ధా భువనత్రయో%పి కురుష్వ రాజ్యం
వినమన్మృగేంద్రమ్ |

శ్రుత్వా స్వపుత్రస్య వచో దురాత్మా తమాహ భీతో%సి కిమత్ర పుత్ర
|| 31

ఉక్త్వేతి పుత్రం దితి జాధినాథో దైత్యర్షభాన్ వీరవరాన్ స రాజా |

గృహ్ణాంతు వై సింహమముం భవంతో వీరా విరూప భ్రుకుటీక్షణం
తు || 32

తస్యాజ్ఞయా దైత్య వరాస్తతస్తే గ్రహీతుకామా వివిశుర్మృగేంద్రమ్ |

క్షణ   న దగ్ధాశ్శలభా ఇవాగ్నిం రూపాభిలాషాత్ ప్రవివిక్షవో వై || 33

దైత్యేషు దగ్ధేష్వపి దైత్యరాజశ్చకార యుద్ధం స మృగాధిపేన |

శ##సై#్రస్సమగ్రైరఖిలైస్త ధాసై#్ర శ్శక్త్యర్షి పాశాంకుశపావ కాద్యైః
|| 34

సంయుధ్యతోరేవ తయోర్జగామ బ్రాహ్మం దినం వ్యాస హి
శస్త్రపాణ్యోః |

ప్రవీరయోర్వ్వర రవేణ గర్జతోః పరస్పరం క్రోధ సుయుక్తచేతసోః ||35

తతస్స దైత్యస్సహసా బహూంశ్చ కృత్వా భుజాన్ శస్త్రయుతాన్నిరీక్ష్య |

నృసింహరూపం ప్రయ¸° మృగేంద్రం సంయుధ్యమానం సహసా సమంతాత్ || 36

ప్రహ్లాదుడిట్లు పలికెను -

ఈ అనంత భగవానుడు నృసింహరూపములో నీ నగరములోపల ప్రవేశించినాడు. కావున నీవు యుద్ధము నుండి విరమించి శరణు పొందుము. నాకు సింహము యొక్క భయంకరాకారము కానవచ్చుచున్నది (30). ఆయనతో పోరాడగల మొనగాడు ముల్లోకములలో లేడు. కావున నీవా నరసింహునకు ప్రణమిల్లి రాజ్యమును కాపాడుకొనుము. తన కొడుకు చెప్పిన ఈ మాటలను విని ఆ దుర్బుద్ధి, 'ఓ పుత్రా! నీవిపుడు భయపడుచున్నావా ఏమి?' అని పలికెను (31). పుత్రునితో నిట్లు పలికి ఆ రాక్షస చక్రవర్తి కోపముతో ముడివడిన కనుబొమలు గలవాడై గొప్ప వీరులగు రాక్షస శ్రేష్ఠులను, 'ఈ సింహమును వీరులగు మీరు చెరబట్టుడు' అని ఆదేశించెను (32). ఆతని ఆజ్ఞను పొంది ఆ రాక్షస వీరులు నృసింహుని పట్టుకొనబోయి అగ్నియొక్క రూప సౌందర్యమును ప్రేమించి దానిలో ప్రవేశించే మిడతల వలె క్షణకాలములో మాడి మసి అయిరి (33). ఆ వీరులు మరణించిననూ రాక్షస చక్రవర్తి నృసింహమూర్తితో యుద్ధమును చేసి, సమస్త-ఆయుధములను, ఆగ్నేయాద్యస్త్రములను, శక్తి, చురిక, పాశము, అంకుశము ఇత్యాది ఆయుధములను ప్రయోగంచెను (34). ఓ వ్యాసా! మహావీరులగు వారిద్దరు సింహనాదములను గర్జనలను చేయుచూ పరస్పరము కోపముతో నిండిన హృదయములు గలవారై శస్త్రములను చేతులయందు ధరించి యుద్ధమును చేయుచుండగా బ్రహ్మయొక్క ఒక పగలు కాలము గడచి పోయెను (35). అపుడా రాక్షసుడు శస్త్రములను దాల్చిన అనేక భుజములు గలవాడై, యుద్ధము చేయుచున్న ఆ నృసింహుని మీదకు వేగముగా అన్ని వైపుల నుండి దాడిచేసెను (36).

తతస్సుయుద్ధం త్వతిదుస్సహం తు శ##సై#్రస్సమసై#్తశ్చ తథాఖిలాసై#్రః |

కృత్వా మహాదైత్యవరో నృసింహం క్షయం గతై శ్శూలధరో%భ్యుపాయాత్ || 37

తతో గృహీతస్స మృగాధిపేన భుజైరనేకైర్గిరిసారవద్భిః |

నిధాయ జానౌ స భుజాంతరేషు నఖాంకురైర్దానవమర్మభిద్భిః ||38

నఖాగ్రస్తహృత్పద్మమసృగ్విమిశ్రముత్పాట్య జీవాద్విగతః క్షణ న |

త్యక్తస్తదానీం స తు కాష్ఠభూతః పునః పునశ్చూర్ణిత సర్వగాత్రః || 39

తస్మిన్ హతే దేవరిపౌ ప్రసన్నః ప్రహ్లాదమామంత్ర్య కృతప్రణామమ్ |

రాజ్యే%భిషిచ్యాద్భుతవీర్య విష్ణుస్తతః ప్రయాత్ గతిమప్రతర్క్యామ్ || 40

తతో%తిహృష్టాస్సకలాస్సురేశాః ప్రణమ్య విష్ణుం దిశి విప్ర తస్యామ్ |

యయుస్స్వధామాని పితామహాద్యాః కృతస్వకార్యం భగవంతమీడ్యమ్ || 41

ప్రవర్ణితం త్వంధకజన్మ రుద్రాద్ధిరణ్య నేత్రస్య మృతిర్వరాహాత్ |

నృసింహతస్తత్సహజస్య నాశః ప్రహ్లాదరాజ్యాప్తిరితి ప్రసంగాత్ || 42

శృణు త్విదానీం ద్విజవర్య మత్తోంధక ప్రభావంభవకృత్యలబ్ధమ్ |

హరేణ యుద్ధం ఖలు తస్య పశ్చాద్గణాధిపత్యం గిరిశస్య తస్య || 43

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్ర సంహితాయాం యుద్ధఖండే హిరణ్యకశిపు వధవర్ణనం నామ త్రిచత్వారింశో%ధ్యాయః (43)

తరువాత ఆ రాక్షస శ్రేష్ఠుడు సమస్త శస్త్రాస్త్రములతో మిక్కిలి దుస్సహమగు యుద్ధమును చేసి అవి అన్నియు క్షీణించిన పిదప శూలమును ధరించి నృసింహుని పైకి ఉరికెను (37). అపుడా నృసింహుడు పర్వతములతో సమానమగు బలము గల అనేక భుజములతో ఆ రాక్షసుని పట్టుకొని మోకాలిపై పెట్టి గోళ్ల కొనలతో మర్మస్థానములను చీల్చివేసెను (38). గోళ్లు అనే ఆయుధములతో రక్తముతో నిండియున్న వాని హృదయ పద్మమును పీకివేయగా ఆతడు క్షణకాలములో ప్రాణములను గోల్పోయెను. పలుమార్లు చూర్ణము చేయబడిన సర్వావయవములు గల ఆ రాక్షసుని దేహము దుంగవలె ప్రాణ విహీనము గాకా, దానిని నృసింహుడు పరిత్యజించెను (39). అద్భుతమగు పరాక్రమముగల విష్ణువు ప్రసన్నుడై ఆ దేవ శత్రువు సంహరింపబడగానే ప్రహ్లాదుని పిలిచి రాజ్యాభిషిక్తుని చేసి ఊహింప శక్యము కాని స్వలోకమునకు వెళ్లెను (40). అపుడు బ్రహ్మ మొదలగు దేవనాయకులందరు మిక్కిలి ఆనందించి తమ కార్యమును నెరవేర్చిన కొనియాడదగిన విష్ణుభగవానుని ఆ దిక్కు వైపునకు నమస్కరించి తమ తమ ధామములకు వెళ్లిరి (41). రుద్రుని నుండి అంధకుడు పుట్టుట, వరాహరూపి యగు విష్ణువు హిరణ్యాక్షుని సంహరించుట, వాని సోదరుని నృసింహుడు సంహరించుట, ప్రహ్లాదుడు రాజ్యమును బడయుట అను వృత్తాంతములు చెప్పబడినవి (42). ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఇపుడు అంధకుని మహిమ, ఆతడు జన్మించుటతోడనే వరములను పొందియుండుట, శివునితో యుద్ధమును చేసి తరువాత ఆ కైలాసనాథునకు గణాధ్యక్షుడు అగుట అను విషయములను నేను చెప్పెదను వినుము (43).

శ్రీ శివమహాపురాణములోని రుద్ర సంహితయందు యుద్ధ ఖండలో హిరణ్యకశిపు సంహారమనే నలుబది మూడవ అధ్యాయము ముగిసినది (43).